హితముపదేశించిరి. శ్రీశంకరాచార్యులవారును భజగోవిందం భజగోవిందమ్మని నామమే స్మరించుట శ్రేయస్కరమని బోధించిరి.

ఈ నామోచ్చారణ చింతనములకు నిషిద్ధసమయములు లేవు. మడుఁగు మైల యను విచారము పనిలేదు.

నామోచ్చారణమందు ఫలము లేదేమో యని సందేహించువా రొక్కపని చేయవలయును. వీథివెంటఁ బోవునపుడు ముందుగఁ గొందఱు పోవుచుండిరేని వారెవ్వరో వారిపేరు లేవో నీకుఁ దెలియకున్నను నూరక యోరిరామా యనియో కృష్ణాయనియో యేదైన నొకపేర నెవరినో మనము పిలుచునట్టివిధముగ గట్టిగఁ బిలిచిన నా పేరుగలవాఁడు తప్పక తిరిగిచూచును. ఇట్టి యనుభవము పెక్కురకుఁ గలిగియుండవచ్చును. ఈవిధముగనే భగవంతుని మన ముద్దేశింపక యాయనపే రుచ్చరించినను భగవంతుఁ డాయన కటాక్షము మనపైఁ బరఁగించును. ఇఁక బుద్ధిపూర్వకముగ నర్థవంతముగఁ బిలిచినఁ దలఁచినఁ గలుగు ప్రయోజనము చెప్పవలయునా ? అజామిళ చరిత్రము స్మరింపుఁడు. బిడ్డలకు దేవతానామము లుంచుట కిదియే కారణము. కావున మనస్సు భగవంతునియందుండక పోయినను నోర భగవన్నామ ముచ్చరించుచునే యుండవలయును. నామస్మరణముచేఁ బ్రేమ లభించుఁ బ్రేమచే భగవంతుఁడు వశుఁడగును.

ఘోరవ్యాధిచే బాధింపఁబడువారు కొంద ఱతికష్టముమీఁద నెవరినో బ్రతికించుటకుఁగాను దాము తీసికొన్నట్లు లిష్టము లేక శ్రద్ధయులేక మందు తీసికొందురు. శ్రద్ధతోఁ దీసికొనిన నెక్కువ గుణమిచ్చు నౌషధ మశ్రద్ధతోఁ దీసికొనినఁ గొంతయైన గుణము చూపక తప్పదు. కొంత మేలుకలుగఁగానే పిమ్మట రోగియే యౌషధము నడిగి యిప్పించుకొని తీసికొనును. అట్లులే బాగుపడఁగోరిన సంసారి తొలుత శ్రద్ధలేకయైన భగవన్నామము స్మరింపవలయును. ఇట్లు కొన్నాళ్లు స్మరింపగాఁ నా యుచ్చారణమునందే యొకవిధమైన మానందము మనస్సునకు గోచరించును. అవల వలదనినను

మానఁడు. దానికి విఘ్నము కలిగినఁ బరితాపపడును. భగవన్నామ స్మరణము రత్నము. ముక్తి గాజుపెంకు.

స్మరణమునందును ధ్యానమందును దొలుత నితరచింతలు రాక మానవు. వానిని గ్రమక్రమముగ నిలిపివేయవలయును. అంత వఱకు నవివచ్చి విఘ్నము కలిగించునని వ్యసనపడఁబనిలేదు. సర్వము భగవన్మయమే. కావున ననియు భగవన్మయమేయనియు భగవంతుని పను పున నవి వచ్చినవనియుఁ దలఁచినయెడల వానియందుండు విషము పోయి యాకాలముకూడ భగవద్విషయమందే కడపినట్లగును.

భక్తియనుతీఁగ యల్లుకొనుటకు శ్రద్ధయను ప్రాపుండవలయును.

ఒక ప్రియపదార్థమును నేకాగ్రతగఁ దలంచునపుడు కన్నులు చెవులు పనిచేయవు. అట్టులే తక్కిన ప్రపంచమునకంతయు నీవు గ్రుడ్డివాఁడవు చెవిటివాఁడ వగుము. నాలుక మాత్రము విసుఁగు లేక హరిస్మరణ చేయుచుండనిమ్ము. అప్పుడప్పు దర్థానుసంధానము చేయుచుండును.

లోఁతు తెలియరాని నీటిలోని మీను భగవంతుఁడు. గాలము మొలికి నామము. మన మనస్సు దానిని గట్టిన దారము. చేఁప యున్నదో లేదో యాగాలమునకుఁ జిక్కునో చిక్కదో యని దార మును వదలినఁ జేఁప చిక్కునాశ లేదు.

ప్రభువును మన యింటికిఁ బిలుచు నుద్దేశము కలదేని యిల్లం తయు శుభ్రముగానుంచి యలంకరింతుముకదా. అట్టులే హరికి వాస స్థానము చేయఁగోరు మన హృదయమును బరిశుభ్రపఱచి నిర్మలముగా నుంచవలయును.

భగవంతునికంటె భగవన్నామము బలీయము. ద్రౌపదీ కరి రాజ నారద ప్రహ్లాదాదుల రక్షించినది నామమేకదా. వాల్మీకి పఠిం చినది రామనామమేకదా. కృష్ణుఁడు సమీపమందుండియు ద్రౌపదీ పుత్రుల రక్షింపనేరఁడయ్యె. ఆయన నామము ద్రౌపదిని రక్షించె. రాముఁడు శరణుజొచ్చిన సముద్రుఁడు వినఁడయ్యె. రామనామము స్మరించి హనుమంతుఁడు సముద్రము దాఁటెను. కావుననే పెద్దలు

నామస్మరణముకన్న సంసారసాగరముఁ దరింప వేఱుపాయము లేద నిరి. కావున బుద్ధిమంతులగువారు యమనియమములఁ బాటించి సాత్త్వికాహారము మితముగఁ గొనుచు నుభయవిధ బ్రహ్మచర్యము లలో నేదైన నొకదానిని గ్రహించి యర్థానుసంధానపూర్వకముగ భగవన్నామము నిరతము స్మరించుచుండుటవలన మోక్షకారణమైన పరభక్తి లభించును.

నిర్మలముగానుండు నద్దమునందే వస్తువులు ప్రతిఫలించును. కదలెడి నీటియందు సూర్యబింబము కానరాదు. కావున హృదయ మున భగవంతుఁడు సాక్షాత్కరింపవలయుననిన దానిని నిర్మలము గాను కలఁతజెందనిదానినిగా నుంచుకొనవలయును. దీనికి రాజ యోగము సహాయపడఁగలదు. భక్తి యనెడు పక్షికి జ్ఞానయోగ రాజయోగములు ఱెక్కలు. కావున వీనిని సహాయముగఁ గొనుట మేలు. యోగవిషయమున స్త్రీలకుఁ బురుషులకు నొక హెచ్చరిక యియ్యవలసియున్నది. ఈకాలమున యోగము పశ్చిమద్వారమున వచ్చుచున్నది. కావున శుద్ధముగా లేమ, యోగము పూర్ణముగఁ దెలియకయు యోగము నేర్పెదమని పెక్కురు మోసగాండ్రు శిష్యుల శిష్యురాండ్రను ధనాశచేతను గామాతిరేకముచేతను జేర్చుకొను చున్నారు. చెఱుచుచున్నారు. కావున యోగాభిలాషులు హెచ్చ రికకలిగి తగినవారిని గురువులుగ వరింపవలయును. లేకుండిన నుభయ లోక భ్రష్టులగుదురు. ఇప్పటికే గ్రంథము పెద్దదగుటను ముద్రింప ధనములేమిచేతను వీనినిగుఱించి వ్రాయ సాధ్యపడదయ్యె.

శ్లో॥ హరేర్నామైవ నామైవ భవభేషజమ్
కలౌనాస్త్యేవ నాస్త్యేవ, నాస్త్యేవ గతిరన్యథా॥

న్యూ విజయ అర్టు ప్రెస్ - తెనాలి.